Registered No. M-4434.

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ అక్టోబరు నెల 30 వ తేది శుక్రవారం [నె 43 రు.



భారతదేశ తీరాన్ని రక్షిస్తున్న భారతీయ నావికుడు లెవిస్ మరఫిరంగిని ఉపయోగించుట.

## యుద్ధ విమర్శ.

స్టాలినుగ్రాడు కోటవలె నిలచుట : జర్మనుల పొరబాటు టిమొషెంకో సేనానికి తోడ్పడుట : రష్యా ఘనమగు విజయం : ఈజిప్టులో బ్రిటిషు పురోగమన దాడి.

నగరం దుర్భేద్యమగు కోటగా మారింది.

స్టాలినుగ్రాడు నగరంలో తీవ్రమగు యుద్ధం కొనసాగుచున్నది. రష్యనులు శత్రువులకు విశేషనష్టం కలిగిస్తున్నారు. వాతావరణం బాగుపడినందున జర్మనులు స్టాలినుగ్రాడులోని ఒక ఫ్యాక్టరీ శిబిరంపై క్రొత్తదాడి ప్రారంభించగల్గిరి. 25,000 మంది సైనికులు, 100 విమానాలు, బలవంతమగు టాంకుదళములు ఆ ప్రాంతమున యుద్ధం చేయుచున్నవి. పైన బాంబులు గుండ్లు పడుచూవుంటే నేలదిగువను కట్టబడిన కర్మాగారములందు ఫిరంగులు టాంకులు రాత్రింబవళ్లు పనిచేయుచున్నవి. గత కొద్ది రోజులలో వాల్గానదిమీదుగా రష్యనులు క్రొత్త సేనలను చాల తెచ్చిరి. రష్యా సైనికులు స్టాలినుగ్రాడు వాయువ్యదిక్కున పోయిన స్థలము నాక్రమించిరి. మార్షలు టిమోషెంకోగారి సేనలు ఆప్రాంతాలందు పాంజారు (టాంకు) డివిజనులను బాగుగ నెదిరించుచున్నవని జర్మనులే తెలుపుచుండిరి. స్టాలినుగ్రాడు నగరం కొద్దిరోజులలో వశంకానేరదని తెలిపిరి. రెండు నెలలు తీవ్రమయిన దాడి జరిపిన పిదప, స్టాలినుగారి నగరము యింకను జర్మనులకు వశంకాలేదు. నగరం ఒక దుర్భేద్యమగు కోటగా మారిపోయింది. విశేషమేమంటే, స్టాలినుగ్రాడు జర్మనులకు వశం

అయిపోయే సమయాన, అతిత్వరగా ముగిసి పోతున్న దాడి నిలచిపోయి, దీర్ఘకాలం ముట్టడిగా మారిపోయింది. 40 మైళ్ల పొడవుగల పరిశ్రామిక నగరం, జిబ్రాల్టరువంటి ప్రకృతిరక్షణ గల కోటగా మారిపోయింది.

* * *

**మనోబలం**

సైనికచర్యలందు చివరకు జయం నిర్ణయించేది మనోబలం పట్టుదల యని పూర్వమొక యుక్తి పరుడు క్లాజివిట్జు నుడివియుండెను. రష్యనులు తమ నాయకుడగు స్టాలినుపేరన నిర్మింపబడిన నగరం జర్మనులవశం కాకూడదని నిశ్చయించుకొనిరి. కావున జర్మనులు దాడి జరిపినపుడల్లా ఆ దాడిని తిరుగగొట్టుటకు తగిన సాధనములను అరయుచుండిరి. రష్యనులకు వచ్చిన కష్టమేమిటంటే, ఒకమైలు వెడల్పుగల నది వెనక్కి యున్నది. దానివొడ్డున నిలచి శత్రుదాడి నెదిరించాలి. తమకు రావలసిన సరకంతా ఆ నది దాటి పడవలపై రావాలి, తమ సైనికులను గాయపడినవారిని నదిదాటి పంపాలి. పైన శత్రు విమానాల కగపడకుండా పొగ తెరలు కప్పి, నదిలో యుద్ధనావలు కాపాడుచుండగా చిన్న పడవలు యీ రవానా చేయుచున్నవి. కాని జర్మను నేలఫిరంగులు, నది కనబడేటట్లు ఎత్తయిన మెరక ప్రదేశాన వున్నవాటికి యీ పడవలు అగపడిపోయినవని యిటీవల వార్తలు వచ్చెను. అంతా నాశనమయిపోయిన పిదప స్టాలినుగ్రాడు నగరం శత్రువులకు వశమయినప్పటికి, పట్టుకున్నామను గొప్పేగాని, వాల్గానదీ మార్గము నిరోధించే అవకాశం వుండదనియు, వాల్గానది మీదుగా మధ్య రష్యానుండి కాకేషియాలోనికి సప్లయిమార్గం యిదివరకే మూతబడినదనియు కొందరు విమర్శకు లనుచున్నారు. కాని యిది తప్పు అభిప్రాయం. చలికాలం తలదాచుకొనుటకు జర్మను సేనలకు ఆ నగరం అవసరం. ఉత్తర కాకేషియానుండి గ్రాజ్నివరకు విస్తరించి యున్న తమ మార్గాలను, కొండ త్రోవలను రక్షించుకొనుటకు స్టాలినుగ్రాడులో ఒక శిబిరం వారికుండాలి.

* * *

**జర్మనుల పొరబాటు**

రష్యాపై జర్మనులు దాడి తలపెట్టి యీయేడు 10 లక్షల సైన్యాన్ని అనేక టాంకులను విమాన విధ్వంసక ఫిరంగులను వినియోగించి ముందుకి వస్తూవుంటే యీ పెనుదాడిని రష్యను సేనానాయకుడగు మార్షలు టిమొషెంకో గారు నిలిపి పెద్దవిజయం బడసిరి. ఒకే స్థలంపై ఒకేసారి కేంద్రీకరించి దాడిచేసే తమ పద్ధతిని విడచి, యిపుడు జర్మనులు స్టాలినుగ్రాడు నగర ముట్టడియు, కాకసస దేశంపై దాడియు ఒకేసారి తలపెట్టి పొరబాటుచేసిరి. అందుచే మార్షలు టిమొషెంకోగారికి అవకాశం దొరికింది. జర్మను సైన్యంయొక్క ఎడమవైపునుండివచ్చి ఛేదించి స్టాలినుగ్రాడుపై వారి దాడి ఒత్తిడిని తగ్గించుటకు టిమొషెంకో ప్రయత్నించెను. అతని దాడి వడి తగ్గిందేగాని నిలిచిపోలేదు. అతడు యీదాడి కొనసాగించినచో డాను నది మళుపులో జర్మనుల ప్రాబల్యం పూర్తిగపోవును. స్టాలినుగ్రాడు నిలచియుండుట ఎన్నిరోజు లాలశ్యమయితే అంతయెక్కువ మేలుకలుగును. శత్రు బలం తక్కువుంది అనుకోరాదు. దానిని వెనుకనుండి పొడుచుట టిమొషెంకోగారికి సులభమనుకోరాదు. కాని వారనెజునుండి స్టాలినుగ్రాడు వరకు రానురాను హెచ్చుచున్న టిమొషెంకో సేనల ప్రక్కదెబ్బ జర్మను సేనలకు చాల ఒత్తిడి కల్గించుచున్నది. అందుచే డానునది ఒడ్డు ననుసరించి జర్మనులు కాకససుపైకి దండయాత్ర చేయుటగూడ విఫలం కాగలదు. స్టాలినుగ్రాడు అయినాక ఉత్తరాన్న మాస్కోనగరంపైకి పోవాలని వానుబాకు సేనాని తలపెట్టినందున హిట్లరాతని పదవినుండి తొలగించెననియు, స్టాలినుగ్రాడు తదనంతరం పెర్షియా ఇరాకు చమురు గనులపైకి పోవాలని హిట్లరు తలంచెననియు చెప్పబడుచున్నది. రష్యను లీ రెండుపనులు కానిచ్చేరుకారు. జర్మను సేనలు, రష్యను సేనలు గూడ దీర్ఘయుద్ధంలో మునిగినవి.

* * *

**రష్యా విజయం**

తూర్పు రంగమున యుద్ధం ముగిసేస్థితికి వచ్చింది. స్టాలినుగ్రాడును రష్యనులు కాపాడుకోగల అవకాశాలు యిపు డెక్కువయినవి. వర్షాలు మొదలయి స్టాలినుగ్రాడు లోయలను బురదచేసినవి. అదివరకు మోటారుబండ్లు యధేచ్ఛగ పోగల మైదానాలు యిపుడు బురదపుంతలయినవి. చలికాలంలోగా నగరం వశంకాకపోతే జర్మను సేనలు వెలుపల మంచులో గడ్డకట్టి చావవలసిందే. ఇచట ఉకరైనులోకన్న ఎక్కువ చలి

[తరువాయి 5 వ పేజీలో]

# విమానదాడి జరిగితే ఏమి చేయాలి ?

## న్యాయమూర్తి వాడ్సువర్తుగారి రేడియో ఉపన్యాసం.

హైకోర్టు న్యాయమూర్తి ఎస్. వాడ్సువర్తు గారు యిటీవల మదరాసు రేడియోద్వారా యిట్లు ఉపన్యశించిరి :—

ఎదురుగా వస్తున్న మోటారుకారు కూత వినగానే రోడు యీ ప్రక్కనుండి ఆ ప్రక్కకు దాటుచున్న ముసలిది యేమి చేస్తుందో మీరెపుడైనా చూచేరా ? వినగానే ముందుకి పరుగిడబోతుంది. రెండడుగులువేసి గాభరాపడి మళ్లా వెనక్కు పరుగుడివస్తుంది. మోటారు డ్రైవరు ఆమెకు ప్రమాదంలేకుండుటకు అన్ని బ్రేకులు వేసి అవస్తపడాలి. ఆమె కొంచెం యోచించు కుంటే, తాను చేయవలసింది పరుగెట్టడంకాదనియు, కదలకనిలుచున్నా లేదా నెమ్మదిగా ముందుకిపోయినా, మోటారు డ్రైవరు తనను సులభంగా తప్పించుకోగలడని, తెలుసుకోగలదు. కాని భయం కలగ్గానే పరుగెట్టడం అందరికి సహజం. దీనినే ఆత్మరక్షణాభిలాష అంటారు. కాని యిట్లాచేస్తే సాధారణంగ ఆత్మవినాశం కలుగుతుంది. ఈ విషయం 1940 వ సం॥ మే నెలలో బెల్జియం ఉత్తర ప్రాంతులందు రుజువయింది. అక్కడ ప్రజలు భయంతో పారిపోయిరి. జర్మనులు నగరం చేరువకైనా రాకముందే వస్తున్నారన్న వదంతులు వ్యాపించినవి. ప్రజలంతా భయపడిరి. ఆత్మ రక్షణాభిలాష అందరిని మృత్యు ముఖానపెట్టింది. చేతిబండ్లు, పిల్లలను త్రిప్పే త్రోపుడు బండ్లు, చక్రాలుగల బండ్లు ఎటువంటివి దొరికితే అటువంటివన్నీ సామానులతో నింపి, ఊరు వెలుపలకు పోసాగిరి. రోడ్లన్నీ బండ్లతోను, యిసుకవేసిన రాలనట్లు జనంతోను నిండిపోయి, నగర రక్షణకై బయటనుండివచ్చు సైనికుల బండ్లకు త్రోవలేకుండెను. ఇంతలో జర్మనులు ఎట్టి నిరోధంలేకుండా నగరంపైకి త్రోసుకొనివచ్చిరి. పారిపోతున్న కాందిశీకులు నడవక నిలచిపోయినచో శత్రు విమానాలు దిగువగా ఎగిరి బాంబులు వేసి మరఫిరంగులుప్రేల్చి, నిస్సహాయులైన ప్రజలను చంపి మరింత భయంకలిగించిరి. ఆ గలాటాలో కుటుంబాలు విడబడి, పశిపిల్లలు, ముసలివాళ్లు రోడు ప్రక్కల విడువబడి చనిపోయిరి. బాధనొందుచు పారిపోతున్న యీ జన సమూహాన్ని అడ్డుటకు వీలులేక దేశరక్షణకై వస్తున్న సైన్యాలు చేసేదిలేక నిలచిపోయినవి. కాని నగరాన్ని ఆక్రమించుటకు వస్తున్న శత్రుసేన యీ జనసమూహం తమదారికి అడ్డురాగానే, మర ఫిరంగులు ప్రేల్చుకుంటూ రోడు మధ్య దారిచేసుకొని త్రోసుకొనివచ్చినవి. మిత్రమండలి సేనలు అట్లు చేయలేకపోయినవి. ఆ రోజులలో సివిలు ప్రజలు అచట ఎందరుచచ్చిరో ఎవ్వరికి ఎప్పటికి తెలియనేరదు. చాల ఎక్కువై యుంటుంది. లక్షల కొలదిగ పారిపోయిన యీ ప్రజ తమ యిండ్లలోనో, రక్షణ గుహలలోనో దాగియుండినచో, వారిలో యెక్కువ మంది బ్రతికేయుందురు. రక్షణ సేనలు జర్మను దాడిని అరికట్టియుండును.

జాడ్యాల ప్రమాదంకన్న బాంబుల ప్రమాదం ఎక్కువ కాదు.

శత్రుదాడికి భయపడి పారిపోవుట ప్రమాదం కావచ్చు కాని విమానదాడినుండి పారిపోవుట కేవలం అవివేకం. రంగూనుపై మొదటి జపాను విమాన దాడిలో ఎక్కువ జననష్టం కలుగుట, రంగూను వాసుల అవివేకం అని యిపుడు అందరికి స్పష్టమయింది. వారు శత్రు విమానాలు యింకా పైన ఎగురుతూ ఉండగనే బయట వీధులలోనికివచ్చి పారిపో ప్రయత్నించిరి. అందుచే యింత ఎక్కువ చావులు సంభవించినవి. వారంతా యిండ్లలోనుండియుంటే బహుశ అందరు బ్రతికియుందురేమో ! మొదటి మూడేండ్ల యుద్ధంలో ఇంగ్లాండులో విమానదాడులవలన ఎంత తక్కువ మంది చనిపోయేరో ఎరుగుదురా ? వేలకు వేలు బాంబులు లండను ప్రాంతములందు వెదజల్లబడ్డాయి, అట్లాంటప్పుడు ఎన్ని లక్షలమంది చావవలసింది ? అట్లా కాక చాల తక్కువమంది చనిపోయిరి. బహుశ నూటికి ఒకటికన్న తక్కువే చావులుండును. ఇండియాలో కలరావస్తే కొద్ది వారాలలో ఎందరు చనిపోతారో చూడండి. అప్పటికీ కలరా అంటే పరుగిడి పారి

పోని ప్రజలు, చేరువలో ఎక్కడో పది బాంబులు పడేసరి వేలు లక్షలుగ ఎందుకు పారిపోవాలి. లండను ప్రజలకన్న యీ దేశం ప్రజలు ఎక్కువ పిరికివారని నేను చెప్పటలేదు. కలరావచ్చినపుడు ఇండియాలో గ్రామస్తులకుండే ధైర్యం చాల ఆశ్చర్యం కలిగిస్తుంది. మలబారులో జరిగిన విషయం ఒకటి నాకిప్పటికీ జ్ఞాపకంవుంది. ఒక ఖైదీని రోడ్డుపై నడిపించి ఒక జమాను మేజస్ట్రేటు కోర్టుకి తీసుకొని పోతూవుండగ సగం దూరంలో పోలీసు జమానుకి అకస్మాతుగ కలరావచ్చింది. ఖైదీ పారిపోడానికి ఎంత చక్కని అవకాశం. కాని ఖైదీ పారిపోలేదు. వాంతులు విరోచనాలు పిచికారుతో కొట్టినట్లు కొట్టుతూవుంటే ఆ జవాన్ని ఆ ఖైదీ బుజాన్న మోసుకొని ఎన్నో మైళ్లదూరం నడచి ఒక వూరు చేర్చి వైద్యునికిచూపి వానిని బ్రతికించెను. అంత ధైర్యమయిన ధర్మమైన చర్య వేరొకటి నేవినలేదు. ఆ ఖైదీకి బహుమతి యిచ్చేరు. చెప్పేదేమంటే, ధైర్యంలేక కాదు ప్రజలు బాంబులనుండి పారిపోయేది. ప్రమాదం ఎటువంటిదో తెలియని అజ్ఞానంవల్ల పారిపోతారు. మదరాసుకి విమానదాడి రాదనే అనుకుందాం. ఒకవేళ వచ్చినా, మదరాసు నగరవాసులు వాటి కలవాటుపడి, పారిపోకుండా తమ పనులు తాము చేసుకుంటు, లండను వాసులవలెనే ప్రశంసా పాత్రులగుదురనుకుంటాను.

ఎపుడూ సిద్ధంగా వుండాలి

తూర్పున పడమరనుగూడ సంయుక్త రాజ్యాలు విమానశక్తియందు శత్రువుని మించియున్నవని మనమంతా భావించుచున్నాము. ముందేమి జరుగునో చెప్పలేముకాని, మన తీరానికి యిదివరకుకన్న యిపుడు శత్రుదాడి భయం తక్కువే. అయినా ఒకవేళ దాడివస్తే యిదివరకుకన్న యిపుడెక్కువ తయారుగానున్నాము. ఈ యుద్ధంలో సాధారణంగా అనుకొననిదే జరుగుతూవుంటుంది. కనుక మన తీరానికి దాడిభయం దాటిపోయిందనుకొని అశ్రద్ధగవుండడం పొరబాటు. అనుకొనని ప్రమాదం అకస్మాత్తుగవచ్చి తిరిగి మదరాసు తీరాన శత్రుదాడి మళ్లా జరుగుతుందనుకోండి. అపుడు సామాన్య ప్రజలు, ఎ.ఆర్.పి. లోనిగాని యితర రక్షణ సర్వీసులలోగాని చేరని ప్రజలు ఏమిచేయవలసి యుండును ? ఈ ప్రశ్నకు జబాబు రెండు మాటలలో చెప్పవచ్చును—ఉన్నచోటనే ఉండండి. ఇంతకన్న మంచిజాగాకు పోదామను అభిలాషలో పరుగుడి తబ్బిబ్బుకాకండి, చేరువనున్న భవనంలోకో నేల గోతులలోకో పోయి ఉండండి. మన విమానాలు బయటకెగిరి శత్రు విమానాలను ఎదుర్కొంటే, ఏమిటో వింతచూద్దామని రోడుమీదికి పరుగెట్టకండి. అట్లా చేస్తే మీమీద ఏదోపడవచ్చును. మరోమాట : మొదటి దాడి ముగియగానే కుటుంబసమేతంగా సామానులు తీసుకొని రైలు స్టేషనుకిపోయి ఇండియాలో యింకో చివరికి టిక్కెట్లకొరకు దేవుళ్లాడకండి. అట్లా చేస్తే మీ యింకిత జ్ఞానం విడచి ఆత్మరక్షణ ఆదుర్దలోపడి, మోటారు ముందర గాభరాపడ్డ ముసలి దానిలాగవుతారు. శత్రు విమానాలు పైనున్నపుడు పోరానిచోట్లు రైల్వే స్టేషనులు రోడ్లూను. అట్లాంటపుడు మీ యిండ్లే ఎక్కువ భద్రమైనవి. చేరువ రక్షణ గోతులుంటే మరీ మంచిది.

పైగా మనందరికి యిట్టి సందర్భాలలో నిర్వహింపవలసిన విధి ఒకటిగలదు. దేశ రక్షణకు నిరోధం కలిగించే పనులేవి మనం చేయరాదు. మన రాకపోకల సాధనాలు మార్గాలు యధా ప్రకారం సాగకుండా యుండుటే శత్రువుకి ఎక్కువ లాభకరం. రోడ్లు రైల్వేలు సివిలు ప్రజలతోనిండి, రక్షణ సైన్యాల రవానాకు మార్గం లేకపోతే మనకు విజయం సున్నా.

సైనికుల నాదరించుట

దక్షిణ ఇండియాలోనున్న మనం యింత కాలం యుద్ధానికి దూరంగానుండుటచే, యుద్ధం చేసే మనుష్యులు, యుద్ధ సాధనాలు ఎట్లుంటాయో ఎరుగం. సిపాయిలు సోల్జరులు పులులు భూతాల వంటివారు, శాంతిప్రియులగు ప్రజలు వారి దరిచేరరాదనే భావంలో చాలమంది ఉంటారు. ఇపుడు చాలమందికి ఇండియను సిపాయిల బ్రిటిషు సోల్జరుల పరిచయం కలిగింది. వాళ్లు మనలాంటి మనుష్యులేననియు, మన రక్షణ కొరకే సైన్యంలో నున్నారనియు తెలిసింది. వారిలో చాలమందికి యిండ్లవద్ద భార్య పిల్లలు ఉన్నారనియు, వారికొరకు పరితపిస్తూ వుంటారనియు, యిక్కడ తాము రక్షించుటకు వచ్చిన క్రొత్త ప్రజలు వారిని ఆదరించి స్నేహభావం చూపితే ఎంతో ఆనందిస్తారనియు, సైనికులతో పరిచయంకలవారు గ్రహించగలరు. మన రక్షకుల పని సులభం చేయడానికి మనం ఎన్నోవిధాల

తోడ్పడవచ్చును. వాళ్లను మన యింట్లకు పిలచి విందులు చేయడానికి అందరికి వీలుండక పోవచ్చును. కాని వారు కనబడ్డపుడు మర్యాదచేయడం స్నేహంగా వుండడం అందరికి సాధ్యమగును. వాళ్ల బ్రిటిషు సోల్జరులుకాని ఇండియను సిపాయిలుగాని, యీ ప్రాంతాలకు వారు క్రొత్తవారనీను, దీన్ని రక్షించడానికే వారు వచ్చేరనియు మనం గ్రహించాలి. మనం ఏ రాజకీయ పక్షానికి చెందిన వారమయినా, మన రాజకీయాల్తో వారి కెటువంటి సంబంధంలేదు. అధర్మాన్ని అణచి ధర్మం జయించేటట్లు పోరాడడం వారి కెంత్ల విధో మనకూ అంత విధే. ఆ కార్యం సాధించుటకు ప్రమాదాలకు సిద్ధపడి ప్రాణాలకు తెగించి యుద్ధంచేయ యింట్లు వాకిళ్ల పెండ్లాం బిడ్డలనువిడచి వారు మనవద్దకు వచ్చేరు. కావున వారే జాతివారైనా మన మిత్రులుగా చూసుకోడం మన ధర్మం.

కొద్దివారాల క్రిందట మదరాసులో జరిగిన ఒక యుదంతం నాకెంతో ఆహ్లాదం కలిగించెను. రాత్రి చాల ప్రొద్దుపోయినాక పూనమల్లి హైరోడులో తమ శిబిరానికి పోయే ఆఖరు రైలుతప్పి ముగ్గురు సోల్జర్లు తిరుగుచుండిరి. ఎక్కడికి పోవాలో వారికి తెలియదు. ఒక వైద్యుడు (మన దేశీయుడు) వారినిచూచి దారితప్పియుందురనుకొని, తానేమయిన సహాయం చేయగలనాయని అడుగ, వారు తమస్థితి తెలిపిరి. అంతనతడు వారిని తమయింటికి తీసుకపోయి కాఫీ యిచ్చి, పడుకుందికి సదుపాయాలుచేసి మరునాడు పంపివేయునపుడు, వారికి భారతీయులంటే ఎంతో అభిమానం గౌరవం కలిగింది. ఎన్ని ఉపన్యాసాలు వింటే వారి కలాంటి అభిమానం భారతీయులయెడ కలుగుతుంది? వారి నాదరించిన భారతీయ వైద్యుడు, భారతీయ స్వాతంత్ర్యం కొరకు జాతిద్వేషం బోధించే వారికన్న ఎక్కువ సేవచేసేడనడానికి ఎట్టి సందేహంలేదు. భారతదేశంయొక్క వేరు ప్రతిష్టలు కాపాడవలసిన బాధ్యత దేశాభిమాను లందరిపైగలదు. దేశరక్షణ కార్యాలకు నిరోధం కలిగించేపని ఏదీ చేయరాదు. తిరిగి వేరొక పరీక్షాసమయం వచ్చి శత్రుచర్య లగుపడినపుడు, మన దేశరక్షణయే ప్రధానంగా నెంచాలి కాని, ముందు మన ఒళ్లు కాపాడుకోవాలనే ఆదుర్ద ఎక్కువ పడరాదు. మానవుని పశువుతో సమానంచేయు భీతి మనలను వశం చేసుకోరాదు. ఆ భీతివల్లనే వినాశం కలుగును. బాంబులువస్తే, మనం బేజారుచెందక శాంతంగానుండి, మన రక్షకుల రాకపోకలకు ఆటంకం కలిగించే పని యేది చేయకుండుట మన విధియని జ్ఞాపకముంచుకోండి. తిరిగి అట్లాంటి భయం ఉండకపోవచ్చును; ఉంటే మాత్రం, బాంబులు పడడం, మర ఫిరంగులు ప్రేలడం, వినబడితే మాత్రం నెమ్మదిగ రక్షణ గుహలుచేరి ఉండండి.

---

[ 2 వ పేజి తరువాయి ]

యుండును. సైబేరియాపైనుండి చలిగాలివస్తుంది. అంత చలిగాలి ప్రపంచంలో ఉత్తరధృవంలో తప్ప యింకెక్కడా లేదు.

స్టాలినుగ్రాడుపై కాల్బలం దాడికి బదులు, సుస్థిరమగు ఫిరంగిదళముల దాడి జరుగునని జర్మను సైనికాధికారులు యిటీవల ప్రకటించిరి. అనగా రష్యనులు చాల నష్టం కలుగచేసినందున, మిగిలియున్న కాల్బల సైన్యానికి విశ్రాంతి యిస్తున్నారన్నమాట. ఈ విశ్రాంతి అయినాక చివర కింకోసారి తీవ్రమగు దాడి చేద్దామని వారి ఉద్దేశం అయియుండును. ఇప్పటికి స్టాలినుగ్రాడు అటూయిటూ కాకుండావుంది అదేనా రష్యాకు చాల లాభకరమగు విజయమే.

* * *

ఈజిప్టులో బ్రిటిషు దాడి

గత సోమవారంనాడు ఈజిప్టు యుద్ధరంగమునందు అక్షరాజ్యాల నేల సైన్యంపై, బ్రిటిషు విమానాలు దాడిచేసినవి. అక్కడనున్న 8 వ సైన్యం శత్రువుపై ప్రారంభించిన సమగ్రమగు దాడిలో యిదో భాగం. ఈ యుద్ధచర్య ఈజిప్టు యుద్ధరంగం పొడుగునా జరుగుచునే యుంది. శత్రువులు యీ దాడికి ఎదురుచూస్తున్నట్టే యుంది. మాల్టాదీవిపై విమానదాడులు ఎక్కువచేయుటయు, ఎంత కష్టనష్టాల కోర్చియైనా క్రొత్తసైన్యాలను తెచ్చుటకు ప్రయత్నించుటయు యిందుకు నిదర్శనాలు.

మిత్రమండలి దాడి గత శుక్రవారం 23 వ తేదీ రాత్రి నిండు వెన్నెలలో ప్రారంభమయినది. నేల ఫిరంగులు అత్యంత యెక్కువగానుండి గుండ్లు ప్రేల్చుచు ముందుకు పోయినవి. 8 వ సైన్యం నాయకుడగు జనరలు మాంటుగొామెరి గారు పురోగమనదాడి ప్రారంభమయినదని దాడి

ప్రారంభించుటకు ముందు విలేఖరులకు తెలిపెను. 8 వ సైన్యమును విమానదళములును అన్యోన్య సహకారంతో కలసికట్టుగ పనిచేయుచున్నవనియు, అందులోనే తమశక్తి యిమిడియున్నదనియు ఆతడు తెలిపెను. ఇటువంటి శక్తివంతమగు దాడి ఈజిప్టు ద్వారముందర జరుగుచున్నది. దీనివలన ముమ్ముందు విశేష ఫలితం చేకూర గలదు. మిత్రమండలికి అక్షరాజ్యాలకు బలాబల పరీక్ష యిది. ఎనిమిదవ సైన్యంయొక్క దాడి అపుడే శత్రువుయొక్క రక్షణశ్రేణిని భేదించి కొన్ని గండ్లేర్పరచెను. ఇపుడవి విస్తరింపజేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈ ఎనిమిదవ సైన్యమే యిదివరకు అత్యద్భుతమయిన కార్యం సాధించెను. రోమెలు సేనాని నిరాఘాటంగా త్రోసుకొని వస్తూవుంటే నిలిపి, తిరుగుదాడి చేయగల్గెను. లిబియాలో నుండి పూర్తిగ ఓడిపోయి పారిపోయివస్తూ అలసియున్న యీసైన్యం ఎల్‌అమినువద్ద శత్రుసేనలను ఎదిరించి నిలిపియుంచగల్గుట యుద్ధ చరిత్రలో చాల గొప్పవిషయం. బ్రహ్మాండమగు ఓటమి ఎదుర్కొనియున్నపుడు కథ అడ్డంగా త్రిప్పివేయబడెను. తిరిగి రోమెలు అటువంటి దాడి చేయలేకపోయెను. ఇపుడు ప్రారంభింపబడిన తిరుగుదాడులలో శత్రువునకు చాల నష్టం కలుగజేయబడెను. ఈ దాడిలో శత్రువుల ఆఫ్రికాదళము బ్రిటిషు విమానాలచే తిన్నటువంటి దెబ్బలు యింకేసైన్యం తినియుండదని టైమ్సుపత్రిక విలేఖరి వ్రాసియుండెను. శత్రుసేనల ధైర్యం పూర్తిగ చెడిపోయిందనెను. 8 వ సైన్యానికి తగినన్ని టాంకులు లేకుండెను. ఒకేపరుగున ఎంతోదూరం పారివచ్చిరి. అట్టి సందర్భంలో ఏ సైన్యానికేనా ధైర్యం చెడుతుంది కాని 8 వ సైన్యానికి చెడదు. అక్షరాజ్య సేనలు విజయపరంపరతో వెంటాడుచువచ్చి త్వరలో అలగ్జాండ్రియా వశంచేసుకొని విశ్రాంతి తీసుకొనుటకు తొందరపడుచుండెను. అటువంటి సందర్భంలో బ్రిటిషు 8 వ సేన సముద్రతీరం నుండి క్వట్టారావరకుగల 35 మైళ్ల ప్రాంతమును కాపలాకాచి శత్రుదాడి నిరోధించగల్గెను.

అపుడు జర్మనులు నైలుడెల్టాకు మరీ చేరువైరి. ఏ ఘంటలో వారి టాంకులు చుట్టుముట్టివచ్చి బంధించునో అను భయముండెను, కాని క్రొత్తసేనల సహాయం రాకుండుటచే అపుడు ఆటకట్టయినది. ఎడారియుద్ధము అనుకూల తావులాక్రమించుటకు పెనుగులాట యుద్ధంగా మారింది. అది కేవలం తాత్కాలికమే. రెండు పక్షాలవారును తిరిగి తీవ్రదాడి సలుపుటకు క్రొత్త సేనలకై ఎదురుచూచుచుండిరి. ఎవరికి సహాయము ముందువచ్చునా యని పోటీపడుచుండిరి.

క్రొత్తసేనలకై పోటీలాట.

చర్చిలుగారు ఈజిప్టులోనున్న కొద్దికాలము నందు సైనికులకు యిట్లు తెలిపిరి: "మీరు చాల అద్భుతంగా పోరాడేరు. మీకు బోలెడు సహాయం వస్తున్నది". ఇపుడీ క్రొత్తయుద్ధం ప్రారంభించుట చర్చిలుగారు చెప్పిన బోలెడుసహాయం వచ్చుటవల్లనే జరిగెను. "ఈజిప్టు దేశము నైలులోయయు తమ స్వంతదేశంవలెనే భావించి బ్రిటిషువారు కాపాడెదరని" చర్చిలుగారు నుడివియుండిరి. ఆ యుద్ధమే యిపుడు ద్విగుణీకృత ఉత్సాహంతో జరుగుచున్నది.

ఈజిప్టుకొరకు యుద్ధం గత రెండేండ్లనుండి జరుగుచున్నది. 1940 జూనులో ఇటలీ ఆఫ్రికా సామ్రాజ్యం సంపాదించే ఉద్దేశంతోనే యుద్ధంలో దిగింది. 1940 సెప్టంబరు 15 వ తేదిన ఇటలీ సైనికులు ఈజిప్టు సరిహద్దుదాటి త్రోసుకొని వచ్చిరి. వారి సేనాని గ్రాజియానీ సెప్టంబరు 18 వ తేదీసరికి అలెగ్జాండ్రియా నగరం ప్రవేసిస్తానని జోశ్యం చెప్పెను. 1940 లో గ్రాజియానీగారు కాదుగదా 1942 లో రోమెలు సేనాని గూడ ఆ పని చేయలేకపోయెను. 8 వ సేన ఈ యుద్ధంలో చాల ముఖ్యమగు రంగమును కాపాడుటకు తీవ్రముగ పోరాడుచున్నది. ఈ ఈజిప్టు యుద్ధరంగము రషియా సేనకు దక్షిణ పీఠమువంటిది. బ్రిటిషు తూర్పు ఆఫ్రికాకు దక్షిణాఫ్రికా యూనియనులకు సింహద్వారం. యూరోపులోనున్న అక్షరాజ్యాలను ఏషియాలోని జపాను నుండి వేరుచేయుచున్నది యీ యుద్ధరంగమే.

జనరలు మాంటుగొమరీగారు చాల ధైర్య విశ్వాసములతో పోరుచున్నారు. మిత్రమండలి దక్షిణరంగం భావిస్థితి వారి సైన్యంపై నాధారపడియుంది.

## బ్రిటిషు వైమానిక నావికులు.



*

బ్రిటిషు నౌకాదళమునకు చెందిన వైమానికులు నౌకలను రక్షించుటకు చేయు ఘన గార్యములు ప్రశంసార్హములు అనేక మంది నావికులు వైమాని శిక్షణ పొందుచున్నారు. అట్టి శిక్షణ ఒసంగుచున్న "సొరచేప" విమానం ఒకటి యీ పటమున కాననగును.

*

## "చల్చల్ రె చల్ జపాన్!"

ఇటీవల ఏ ఊళ్లోచూచినా, యీ సినెమా పాట ప్రతిధ్వనించింది. ఈ హిందూస్తానీ పాట బాగా అర్థం చేసికోదగినదే—

"చల్చల్‌రె, నౌ జవాన్
కహ్నా మేరా మాన్ మాన్ . . . (చ)

"ఓ నవ యౌవనుడా! ముందుకు సాగిపొమ్ము,
నా మాటకు లోబడిఉండు."

"దూర్ తేరా గాం, ఔర్ ధకే పాం
ఫిర్భి తు హర్దాం ఆగే బడా కదం.

"నీ నివాసగ్రామము చాలాదూరంగా ఉంది, నీ పాదములు అలసిపోయినవి,
అయినను, నీవు ముందుకేపోవాలి, అనుక్షణమున్నూ—"

"రుక్నా తెరా కాం నహీ
చల్నా తెరా షాన్" . . . (చ)

"ఆగడం నీ పనికాదు.
ముందుకు పోవుటయే నీ ఘనకార్యం."

ఈ పాటలో ఉన్న సారసంగ్రహం ఏమిటంటే, "ఓ నవయౌవనుడా! ("నౌ జవాన్!") నా మాట శిరసావహించి నీవు అనుక్షణమున్నూ ఇంకా ముందుకు సాగి నడుస్తూ ఉండవలసిందేగాని, మధ్యలో ఆగడం నీ పనికాదు. నీ స్వగ్రామం విడిచి నీవు చాలా దూరమునకు వెళ్లియుండినప్పటికీ, నీ పాదాలు అలసిపోయినప్పటికీ, నీవు అనుక్షణమున్నూ ముందుకే పోవాలి."

ఈ రోజున జపానుసేనల గతికూడా ఇట్లాగే ఉంది. జర్మనీకంటె చాలా ముందుగానే జపానువాళ్లు యుద్ధం ప్రారంభించారు. చైనాతో యుద్ధం ప్రారంభించి ఇప్పటికి 5 సంవత్సరాలైంది. 45 కోట్ల ప్రజలుగల బ్రహ్మాండమైన చైనా రాజ్యం అది—9 కోట్ల ప్రజలుగల చిన్న జపానురాజ్యం ఇది. అంత పెద్ద చైనా రాజ్యం జపాను లంకకు చాలా దగ్గరలో ఉన్నప్పుడు ఆ చైనా రాజ్యాన్ని జపానువాళ్లు తమ వశంలో ఉంచుకొని, ఏలుకుంటూఉంటే ఎంతో దివ్యంగా ఉంటుంది గదా అనే ఆశ జపాను ప్రభుత్వ మంత్రులకు చాలా కాలంనుంచీ కలిగింది. ఆశకు అంతులేదు. తనంతట తాను చైనామీదకు దండయాత్ర జపాను సాగించింది. 5 సంవత్సరాలు యుద్ధం చేసిందిగాని, ఏమీ సాధ్యంకాలేదు. ఆసియాఖండంలో చైనాతో యుద్ధమును ఒక మూల జపాను సాగిస్తూ ఉండగానే, యూరోపు ఖండంలో జర్మనీ తనదండయాత్రలు సాగించింది. జర్మనీపక్షంలోనే జపానుచేరింది. కనుక, బ్రిటిషువారి పక్షంలోను, అమెరికావారి పక్షంలోను, అనగా మిత్రమండలి పక్షంలో చైనా చేరింది. చైనాకు అమెరికా రాజ్యం కోట్లకొలది ద్రవ్యం సహాయంచేసింది. కావలసిన ఆయుధ సామగ్రులను సప్లయిచేసింది. ఈ రోజున, చైనాలో అమెరికను విమానాలు చైనా సేనల పక్షమున

యుద్ధం చేస్తున్నవి. అమెరికను వైమానిక దళం చైనాకువెళ్లి అక్కడ జపానువాళ్లు తల యెత్తకుండా యుద్ధం చేస్తోంది. చైనాలోని చికియాంగు అనే పరగణా జపాను లంకకు చాలా దగ్గరగా ఉంది. ఆ చికియాంగు పరగణాలోని కోస్తాలో మంచి విమానాశ్రయాలు ఉన్నాయి. ఈ విమానాశ్రయాలనుండి అమెరికను విమానాలు బయలుదేరి దగ్గరలోఉన్న జపానుయొక్క ముఖ్య నగరమైన టోకియోమీద కొలది మాసాల క్రిందట బాంబులువేసినవి. అందువల్ల ఆ చికియాంగు పరగణాలోని కోస్తాప్రాంతంలో ఉన్న విమానాశ్రయములలో అమెరికను విమానాలు మకాము చేయుటకు వీలులేకుండా ఆ కోస్తా ప్రాంతమును ఆక్రమించుకోవలెనని, కొన్ని మాసాలనుంచిన్నీ జపాను సేనలు అక్కడ బ్రహ్మాండమైన ప్రయత్నం చేసాయి. కాని, జపాను సేనల ఆట అక్కడ ఏమీ సాగలేదు. చికియాంగు రాష్ట్రం పట్టుకోవలెనని అంత పట్టుదలతో జపానువారు ప్రయత్నించుటకు కారణమేమిటి ? ఆ చికియాంగు కోస్తాలో అమెరికను విమానాలుదిగి అక్కడనుంచి సులభంగా జపాను మీద బాంబులువేసి జపాననే (మూల విరాట్టునే) అమెరికావారు నాశనం చెయ్యడం సాగిస్తారు. అందువల్లనే, " టోకియో విధ్వంసక రాష్ట్రం " అనే పేరు ఆ చికియాంగు రాష్ట్రానికి ఏర్పడింది. ఇంతకూ, ఎన్ని విధాలుగా అవస్థపడినప్పటికీ, చికియాంగు రాష్ట్రపు కోస్తా ప్రాంతం జపానువారి వశం కాలేదు. అమెరికను విమానాలకు దివ్యమైన ఆశ్రయం అక్కడ జపానుకు చెంతగా చెక్కు చెదరకుండానే ఉంది. పాముపుట్టమీద తలపెట్టి నిద్రపోతున్నట్లుగావుంది జపానుకు— చికియాంగునుండి అమెరికను విమానాలు, ఏ క్షణంలో జపానుమీదకు దండెత్తివచ్చి బాంబుల వర్షం కురిపించునో ఎట్లా తెలుస్తుంది ?

చైనాలో యుద్ధం ఎన్నేళ్లుచేసినా జపానుకు అక్కడ లొంగినటువంటి పెద్ద ప్రాంతం ఏమీ లేదు. బ్రహ్మాండమైన చైనా రాజ్యాన్ని జయించడం బ్రహ్మకైన వశమా అన్నట్లుగా ఉంది.

అక్కడ జపానుకు విసుగెత్తింది. అందుకని ఆ బ్రహ్మాండమైన చైనా రాజ్యంలో యుద్ధం విరమించుకొని, బర్మా అనబడే బ్రహ్మదేశం మీదకే జపాను దండెత్తివచ్చింది. బర్మానుంచి చైనాకు ఒక రోడ్డును బ్రిటిష్వారు నిర్మించి, ఆ రోడ్డుమీదుగా చైనాకు ఆయుధసామగ్రులను సమృద్ధిగా సులభంగా సప్లయిచేస్తూ ఉండడంచేత, ఆ రస్తాను బంధించవలెనని బర్మామీదకు జపాను దండెత్తి వచ్చింది. ఆ రస్తాను బంధిస్తే ఇండియాలోనుంచి మరొక రస్తాను బ్రిటిష్వారు అస్సాము రాష్ట్రం మీదుగా తయారుచేసారు. కనుక యీ రస్తానుకూడా బంధించవలెనని జపాను ఆలోచన చేస్తోంది. అందుకొరకై అస్సాంరాష్ట్రంమీదకుకూడా విమానదాడి సాగించింది. ఈ రస్తాను మూసినప్పటికీ ఇండియాకు పడమటి వైపునుంచి అనగా వాయవ్య సరిహద్దు రాష్ట్రాలనుంచి సింకియాంగుమీదుగా చైనాకు మరొక త్రోవ సిద్ధంగా తయారుచేసి ఉంచారు. ఈ విధంగా యీ త్రోవలన్నీ బంధించవలెనంటే భారతదేశాన్ని బంధించవలసివస్తుంది. 40 కోట్ల ప్రజలుగల బ్రహ్మాండమైన భారత దేశం ఇది. 45 కోట్ల ప్రజలుగల చైనా రాజ్యంతో కొంచె మించుమించు సరిసమానమైన రాజ్యం యిది. ఉత్తరమున కాశీనుంచి దక్షిణమున రామేశ్వరంవరకు రమారమి 1,500 మైళ్లు పొడుగున విస్తరించిన రాజ్యం యిది. రష్యాలో జర్మను సేనలు క్రిందటి సంవత్సరం ఉత్తరమునుంచి దక్షిణంవరకు 1,500 మైళ్ల పొడుగున విస్తరించిన యుద్ధరంగంలో ఒక్కమారుగా యుద్ధంచేయవలసివచ్చింది. అంత పెద్ద యుద్ధరంగంలో, యీ మూలనుంచి ఆ మూలకు ఆవరించి యుద్ధం చెయ్యడం జర్మనులకు సాధ్యంకాలేదు.

కాని, జపానువాలాకు ఇండియామీద కన్ను ఉంది. "ఏం ? జపానువాలా ! ఇండియా కావాలా ?" అంటే, వద్దంటాడా ? అందుకనే ఇండియాలోని సేనలకన్నింటికిని సర్వసేనాధిపతియైన వావెలు సేనాని, జపాను వాళ్లను రండి ! యుద్ధానికి రండి ! అని సవాలుచేసి కవ్విస్తున్నాడు. వావెలు సేనాని సమయంచూసి, తానే బర్మామీద దండెత్తుటకు తయారవుతున్నాడు. ఇదే సమయంలో అమెరికనులు జపాను రాజ్యంమీదనే విమానదాడి సాగించుటకు వీలుగా, చైనాలోని చికియాంగు రాష్ట్రం "టోకియో విధ్వంసక రాష్ట్రం" అమెరికను విమానాలకు అనుకూలమైన మకాముగా ఉంది.

కాని, జపాను ప్రధాన మంత్రియైన టోజో తన జపాను సేనలను " ముందుకు పోండి !

(తరువాయి 10 వ పేజీలో)

# ఎ.ఆర్.పి. వార్డనులు.

## ప్రజల "సారధి, సచివుడు చుట్టము".

ఇంగ్లాండులో సివిలు రక్షణ శాఖ ఇన్‌స్పెక్టరు-జనరలైన వింగు కమాండరు టి. జె. హోపెలుగారు యీ వ్యాసం వ్రాసిరి :—

ఇంగ్లాండులో వార్డను సర్వీసు ప్రారంభించినపుడు వార్డనులు సివిలు ప్రజల సారధి సచివుడు చుట్టం మిత్రులుగా నుండాలని ఉద్దేశింపబడినది. ఆ ఉద్దేశం బాగా నెరవేరిందని జర్మనీ మెరుపు దాడి సమయాలందు రుజువయింది.

వార్డనులు ఎంత అవసరమో తెలుసుకోవాలంటే యీ యుద్ధంయొక్క ప్రధాన లక్షణం జర్మనీ-ఇటలీ-జపానులు గుర్తించినట్లే మనం గుర్తించాలి. ఇది అందరికి సంబంధించిన యుద్ధం. ప్రతివాడు యీ యుద్ధంలో ఏదో విధంగా పాల్గొనక తప్పదు. అందుచే సివిలు ప్రజలే మూలాధారం, పునాదువంటివారు. వారి ధైర్యం చెడితే అంతా చెడుతుంది.

సివిలు ప్రజల ధైర్యం చెడగొట్టుటకే హిట్లరు ఉద్దేశించి విమాన దాడులు రాత్రింపగల్లు జరిపెను. ప్రజలే ధైర్యం వీడియుంటే అంతా పోయేదే. అందుకే అట్లు జరుగకుండుటకై యీ యెత్తుకి పై యెత్తుగా మేము ప్రజల సంస్థనే ఒక దానిని స్థాపించితిమి.

బాంబులు పడుతూవుంటే పనిచేయడం ఎవరికేనా కష్టమే. అందులో ముఖ్యంగా సైనిక శిక్షణలేని సామాన్య ప్రజలకు మరిన్నీ. పోలీసు దళాలు చాలవు. కావున ప్రతి గ్రామం ప్రతి వీధికి పోగల వార్డనుల సర్వీసును స్థాపించి, వారికి సివిలు ప్రజల మనోధైర్యం చెడకుండ చేయవలసిన పనులన్ని నేర్పితిమి. సివిలు ప్రజలకును ప్రజారక్షణ సంస్థకు (అంటే ప్రభుత్వానికి) మధ్యవర్తులుగా వారు పనిచేసిరి.

### రిపోర్టుచేయుట.

తన ప్రాంతంలో తాను నాయకుడుగానుండుటే వార్డనుయొక్క ముఖ్యకర్తవ్యము. అంత ముఖ్యమైనపనే యింకోటుంది. బాంబులు పడితే అదే రకం బాంబో, ఎంత నష్టం కలిగించిందో సరిగా క్లుప్తంగా వడిగా అధికారులకు తెలియజేయాలి. ఈ రిపోర్టు ఎంత త్వరగా చేస్తే అంత బాగా రక్షణ జరుగగలదు.

బాంబు పడుతున్న శబ్దం వార్డను వినగానే, అది ప్రేలే శబ్దంవిని అది ఎక్కడపడిందో తెలుసుకోవాలి. బాంబు పడడం విని ప్రేలడం వినబడకుండావుంటే, అది వ్యవధి తీసుకొని ప్రేలే టైము బాంబను కోవాలి. ఏది పడినా అతడచ్చోటికిపోయి, ఏమి జరిగిందో చూచి, ఎందరికెటువంటి బాధ కలిగిందో, మంటలు లేచేయో, దుర్వాయువులు వ్యాపించేయో, నీటి గొట్టాలు తెగేయో ఎలక్ట్రికు తీగలు తెగేయో గమనించి, వెంటనే అర్జంటు వార్త సాధ్యమైనంత తక్కువ వివరాలు తెల్పుతు, కంట్రోలు కేంద్రానికి పంపాలి. వెంటనే ప్రథమ చికిత్సదళం పంపాలో, త్రవ్వితీసే సహాయదళాలు పంపాలో, మంటలార్పేవారిని పంపాలో అక్కడున్న ఆఫీసరు తెలుసుకోవాలి. ఆ సమాచారం వార్డను రిపోర్టులో చెపితే సహాయం నిరాలశ్యంగా వస్తుంది. వార్డను చేరువనున్న 'ఫైరు స్టేషనుకి' తానే కబురు చేయవచ్చును. ముందు ఎక్స్ప్రెసు రిపోర్టు పంపినానక, యితర వార్డను అంతా వివరంగా చూచి పెద్ద రిపోర్టులు తయారుచేయవచ్చును. కేంద్రంనుండి సహాయంవచ్చేవరకు దెబ్బతిన్నవారికి సహాయం చేస్తూవుంటారు.

కావున మొదట చేయవలసింది రిపోర్టు పంపుట, తరవాత పడినవారికి సహాయంచేయుటే జరగాలి. దాడి పలుతావులందు జరిగినచో కేంద్రంనుండి సహాయంవచ్చుట ఆలశ్యమగును, అపుడు వార్డనులే ప్రథమ చికిత్సచేసి, మంటల బాంబులను ఆర్పవలసియుండును. అచటి ప్రజల ఆస్థి ప్రాణాల రక్షణ వార్డనుల పూచీలో నుండును. కావున యీ పనులన్ని వారికి నేర్పబడును.

### ఆప్రాంతం అంతా వార్డనుకి తెలిసివుండాలి.

వార్డను మంచి సేవచేయాలంటే తానున్న ప్రాంతమంతా బాగా తెలిసియుండాలి. ఏ యింట ఎంతమంది యున్నారో, ప్రథమ చికిత్స కేంద్రం, రెస్క్యూ డిపోలు చేరువలో ఎక్కడనున్నవో, ఎలక్ట్రికు తీగలు, నీటి కొళ్లాయి మెయిను గొట్టాలు ఎక్కడనున్నాయో, అన్ని తెలిసియుండాలి. బాంబు పడ్డాక అంతా చీకటి గా భరాగానున్నపుడు యిటువంటి సమాచారమంతా బుర్రలో పెట్టుకున్న వార్డనువుంటే పని సుల

భంగా అవుతుంది. అప్పుడు మ్యాపులు గైడు పుస్తకాలు వెతకడం కష్టం.

వార్డనులు ప్రజా విశ్వాసం కలిగియుండాలి. అతనికి కావలసిన సహేతుకమైన సమాచారం అంతా ప్రజలాతనికి యిచ్చి తోడ్పడాలి. వారికి అతనియందు విస్వాసముంటేగాని ఆ సమాచారం చెప్పరు. వారాంతంలో ఎవరే యింటినుండి వెళి పోతారో క్రొత్తవారే యింటికి ఎక్కువమంది వచ్చేరో అంతా వార్డనుకి తెలిసివుండాలి. అతనికి సరియైన సమాచారం తెలిసియుంటేనే ఎక్కువ ప్రాణాలు రక్షింపబడుటకు అవకాశముండును.

రక్షణ గుహలు మందిరాలు ఎక్కడనున్నాయో ప్రజలకు వార్డనులు చెప్పకలిగియుండాలి. వార్డనులకు మంటలార్పుట, బాంబులు ఆర్పుట అన్ని తెలిసియుండాలి. ఈ సందర్భంలో ఎట్లు ప్రవర్తించాలో అతనికి నేర్పబడును. అతను అన్ని సందర్భాలలో ఓర్పు శాంతం కళిగియుండాలి. వార్డనులు ప్రమాదాలలోనికి ఉరకకుండా, తమ శరీరం కాపాడుకోడంకూడ చూచుకోవాలి. వారి పనిచేయడానికి విమానదాడి జరుగుతూ వుంటే వారు బయటనుండాలి కనుక మరీ శ్రద్ధగనుండాలి.

స్త్రీలుకూడా

స్త్రీలుగూడ ఒక్కొక్కప్పుడు పురుషులకన్న మంచి వార్డనులుగ పనిచేయగలరు. వార్డను సర్వీసులందు ఎక్కుమంది స్త్రీలు బాధ్యతగల పనులు చేయుచున్నారు. ఒక స్త్రీ వార్డను క్రింద కొన్ని వందలమంది పనిచేయుచున్నారు. వారంతాకూడా ఆమె వెంటానుంటే తమకేమీ భయం లేదను నమ్మకంతో ఆమె చెప్పిన పనంతా చేస్తారు.

వార్డనులంటే అట్లాయుండాలి. వార్డనులు స్వంత పూచిపై ఎన్నో పనులు చేయవలసియుండును. ఒకొక్కప్పుడు రవానా సౌకర్యాలు చెడి, వార్తలందక కేంద్రంనుండి సహాయమే రానవుడు అక్కడున్న పరిస్థితులలో చేయదలచిన సహాయకార్యమంతా తానే ఉన్నవారితో చేయించాలి. వార్డనుల పని యింత ముఖ్యమైనది. సివిలు ప్రజలకు మిత్రులు హితులు సలహాదారులు దారిచూపేవారు వార్డనులే. యుద్ధానంతరం వారికి మంచి పనులు దొరుకవచ్చు. అంతవరకు వార విజయానికి తోడ్పడెదరు.

[ 8 వ పేజీ తరువాయి ]

ఇంకా ముందుకు పోండి ! అని ఆర్డర్లువేసి తరుముతున్నాడు. "చల్చల్‌రె చల్ జపాన్" అంటున్నాడు. స్వదేశమైన జపాను రాజ్యమును విడిచిపెట్టి రమారమి రెండువేల మైళ్ల దూరంలో ఉన్న ఇండియా సరిహద్దులవరకు అనగా బర్మా లోనికి జపాను సేనలు వచ్చాయి. కాని, యింతటితోనైనా జపాను సేనలు ఆగవచ్చునుగదా. ఆగడానికి వీలులేదు. జయించిన ప్రాంతాలను పోగొట్టుకొనకుండా ఉంచుకోవలెనంటే బ్రిటిష్ వారితో యుద్ధంచేసి జయించాలి. ఒక్క బ్రిటనుతోనేకాదు, అమెరికాతోకూడా యుద్ధం చెయ్యాలి. ఒక్క అమెరికాతోనేకాదు. ఆస్ట్రేలియాతోకూడా యుద్ధంచెయ్యాలి. చైనాతోయుద్ధం చేసిచేసి ఇంకా దానిని జయించనేలేదు. అందువల్ల జపానుకు ఆగడానికి వీలులేదు. వెనుకకు తిరుగడానికీ వీలులేదు. వెనుకకు తిరిగితే, వెన్నెముక విరిగేటట్లుగావుంది. ముందుకుపోతే అందరానిపండుగావుంది. అందువల్ల గత్యంతరం లేక జపాను సైనికులను "ముందుకు పోండి ! ఇంకా ముందుకు పోండి !" ("చల్చల్‌రె చల్ జపాన్") అని జపాను ప్రధాని ముందుకు తరుముచున్నాడు. "ఆగడం మీ పనికాదు. నా ఆజ్ఞ శిరసావహించి ముందడుగు వెయ్యడమే మీరుచేసే ఘన కార్యం ! అంటున్నాడు. ("రుక్నా తెరా కాం నహీ—చల్నా తెరా షాన్") "మీ స్వదేశానికి మీరు దూరమైనా సరే, మీరు అలసిపోయినా సరే" ("దూర్ తెరా గాం— ఔర్ ధకే పాం") "పోండి ముందుకు పోండి" అని జపాను సైనికులను తరుముతూ ఉండడమే టోజో ప్రధానికి తోచిన ఉపాయం. ఆఖరుకు, ఏ జపాను ప్రధాని జపానువాళ్లను "పొండి, పొండి" అని యుద్ధంలోకి అంతులేకుండా తరుముతున్నాడో, ఆ జపాను ప్రధాని యొక్క యుద్ధ తంత్రం మూలంగానే, జపాను వాళ్లు (న్యూగినీ అడవులలో చెట్టులపాలై పుట్టల పాలై పోయినట్లుగానే) స్వదేశాన్నికూడా వదలుకొని అధోగతి పాలై పోవలసివస్తుంది. దిగిన కొద్దీ గోతిలో దిగబడతారు. సాగించిన కొద్దీ సమరం సాగుతూనే ఉంటుంది. "చల్చల్‌రె చల్ జపాన్" అని టోజో ప్రధాని ఆర్డరు చేస్తూఉన్నాడు. వస్తేరాని చావగొడతానని వావెలు సేనాని సవాలు చేస్తున్నాడు.

# ఇంగ్లాండులో ఎక్కువ నౌకలు తయారగుట.

ఇంగ్లాండులో యిపుడు యిదివరకు కన్న ఎక్కువ నౌకలు ఎక్కువ వడిగా తయారగుచున్నవి. ప్రతి నౌకా నిర్మాణకేంద్రమునందు యిదివరకుకంటె ఎక్కువ తయారగుచున్నవి. 1939 వ సం॥లో ఎంత ఎక్కువ తయారు చేయాలని యీ పరిశ్రమ తల పెట్టెనో అంత ఎక్కువ యిపుడు తయారుచేయుచున్నారు.

న్యూ కాసిలులో నౌకా నిర్మాణ పరిశ్రామికులు ఇంజనీరుల సంస్థయందు అధ్యక్షత వహించిన జె. రాంసే గెబ్బీగారు తమ ఉపన్యాసమునందు పై విషయములు తెలిపిరి. సంఖ్యలు యిపుడు తెలుపుటకు వీలులేదు. కాని అవి తెలిసిన పిమ్మట అందరు ఆశ్చర్యపోతారనిరి. యుద్ధం ప్రారంభమైనాక యీ పరిశ్రమకు ఎన్నో ప్రతి బంధకాలు అసౌకర్యాలు కలిగినవి. అయినను ఉత్పత్తి ఎక్కువయినది.

అమెరికాలో ఉత్పత్తి కన్న బ్రిటనులో ఉత్పత్తి ఎక్కువని గెబ్బీగారి ఉపన్యాసంవలన తెలియవచ్చెను. అమెరికాలో ఉత్పత్తికి ఎట్టి యుద్ధ చర్యల నిరోధములేదు. బ్రిటనులో రేవులందు అంత హాయిగ పనిచేయవీలులేదు. అమెరికాలో వలె మూడు జట్లుగ పనివారు ఒకరి తరువాతనొకరు వచ్చి 24 గంటలు పని జరుపుచుండే అవకాశం ఇంగ్లాండులోలేదు, అయినను ఇంగ్లాండులో నౌకల ఉత్పత్తియే అమెరికా కన్న ఎక్కువ. ఇంగ్లాండులో దీపాలార్పులను నియమము పూర్తిగ అమలు జరుపబడుచున్నందున కొన్ని గంటల పని తగ్గిపోవును.

ఒక నౌకా నిర్మాణశాలయందు మూడు వారాలకు ఒక 10,300 టన్నుల వర్తక నౌక నిర్మింపబడుచున్నది. అచట నౌకలకు కావలసిన ఇంజను అచట తయారయే నౌకలకేగాక, యితర చోట్లకుగూడ తయారుచేసి పంపబడును. నౌకల ఇంజనీరుల కంపెనీ ఒకదానియందు పక్షానికొక నౌకాఇంజను తయారుచేయుచున్నది. ఇట్లా చాల కంపెనీలందు తయారగుచున్నవి.

నౌకల భాగాలను వేరువేరు చోట్ల తయారు చేయించి, అవన్ని ఒకచోట జతచేసి స్టీమరు కట్టుట అమెరికాలో మాత్రమే విరివిగ జరుచున్న పనియని చెప్పబడుచుండును. కాని ఇంగ్లాండులో నౌకా నిర్మాణ పరిశ్రమయందు యీ పని ఎంతకాలంనుండో జరుగుచున్నది, దేశమంతటిలో తీరానికి ఎన్నో మైళ్ల దూరంలో నౌకలకవసరమగు భాగములు తయారయి రోడుపైని రైలుపైని కాల్వలపైని రవానా చేయబడి నౌకాకేంద్రాలలో కూర్చి నౌకలుగా అమర్చబడుచున్నవి. కొన్ని కంపెనీలలో స్టీమరు మాస్టులు (స్తంభాలు) మాత్రం తయారుకాగలవు. ఇతర కంపెనీలు పై కప్పులు, స్టీమరుపైనుండు గదులు, మున్నగునవి తయారుచేయగలవు. ఆ భాగాలన్ని కూర్చుట బందులు మేకులతో కూర్చుట రేవులో జరుగచుండును.

అడ్మిరాలిటీ కార్యాలయంలోని వర్తక నౌకల నిర్మాణం రిపేరు శాఖవారు యీ పనులన్ని తణికీ చేయుచుందురు.

# ఇండియాలో చీనా సైనికుల శిక్షణ.

చీనా సైనికులకు శిక్షణ యొసంగుటకు ఇండియాలో ఎక్కడనో ఒకచోట శిక్షణ శిబిరం గలదు. బర్మాను తిరిగి ఆక్రమించి తమదేశం పోవుటకు వారు తయారగుచున్నారు. వారికి అమెరికా సంయుక్త రాష్ట్రముల సైనికోద్యోగులు ఆధునిక యంత్ర సాధనములతో శిక్షణ యొసంగుచున్నారు. చీనాలోనున్న సైనికులకు లభించనటువంటి యుద్ధ సాధనములు వీరికి లభించినవి.

చీనావారుపయోగించిన ఫిరంగులుకొన్ని అమెరికాలో 15 సంవత్సరముల పరిశోధనాంతరం తయారుచేయబడిన క్రొత్త రకములుగలవు. అవి వాడుట యిదివరకు అమెరికావారికే తెలియును. ఇవి వాడుకచేయు యితర దేశములలో చీనావారే మొదటివారు. అత్యంత ఉత్సాహంతో వాటిని ఉపయోగించుట నేర్చుకొనుచున్నారు. చుట్టు అడవులతో నిండిన కొండల మధ్యనున్న కొన్ని వందల ఎకరాల మైదానంలో యీ తుపాకుల శిక్షణ జరుగుచున్నది. వారి తుపాకులు ప్రేలే శబ్దము చుట్టు కొండలలో ప్రతిధ్వనించుచుండును.

## మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

| నెంబరు | హోదా. | పేరు. |
|---|---|---|

**తప్పిపోయినవారు.**

ఇండియను ఫిరంగి దళం—

| | | |
|---|---|---|
| 15455 | సిగ్నలరు .. | గంగాధరన్. |
| బి/638 | సిగ్నలరు . | సి కుమారనాయరు |
| 15425 | సిగ్నలరు .. | రాధాకిషను |
| 15397 | సిగ్నలరు .. | సంజీవ రావు. |
| 15580 | సిగ్నలరు | సుబ్బా రావు |

**చనిపోయినవారు.**

తిరువాంకూరు శాస్త్రిక దళం—

| | | |
|---|---|---|
| 3909 | | సర్దారు ఎస్ రాగవన్. |

**వీరు కాక :**

| | |
|---|---|
| చంపబడినవారు ... | 15 |
| గాయపడినవారు . ... | 24 |
| తప్పిపోయి చంపబడినట్లు ఎంచబడినవారు. | 56 |
| తప్పిపోయి ఖైదీలుగనున్నట్లు ఎంచబడినవారు. | 2 |
| తిరిగిచేరినవారు ... ... | 20 |
| చనిపోయినవారు . .. | 12 |

**తప్పిపోయి యుద్ధ ఖైదీలుగానున్నట్లు ఎంచబడిన వారు**

ఐ ఎ ఓ.సి.—

| | | |
|---|---|---|
| ఒ/74597 | పి ఎ ఎల్. నా/డ్రైవరు | ఆంగప్ప నాయుడు. |
| ఒ/74581 | సిపాయి/డ్రైవరు | సి. జ్ఞానప్రకాశం |
| ఒ/74520 | సిపాయి/డ్రైవరు. | వి కృష్ణస్వామి. |
| ఎం టి./ 949278 | లా/నా/డ్రైవరు. | మలప్ప. |
| ఎం.టి./ 949569 | సిపాయి/డ్రైవరు | మలప్ప. |
| ఒ/74604 | సిపాయి/డ్రైవరు. | నారాయణ నాయరు. |
| ఒ/103231 | సిపాయి/ఫిట్టరు. | రామదాసు. |
| ఒ/72742 | సిపాయి/డ్రైవరు. | సుందర రామన్. |

**చనిపోయిరి.**

ఐ.ఎస్ సి —

| | | |
|---|---|---|
| ఎ/5667 | సిగ్నల్ ... | పి కె కుందున్ని నాయర్ |

**వీరు కాక :**

| | |
|---|---|
| తప్పిపోయి ఖైదీలుగానున్నట్లు ఎంచబడినవారు. | 215 |
| చనిపోయిరి ... | 2 |
| కనబడలేదు ... . | 1 |
| తిరిగిచేరినవారు ... ... | 1 |
| కనబడగ మునిగిపోయిన ట్లెంచబడినవారు. | 10 |

## కాశీ క్షేత్రం.



జపానువారు సింగపూరును స్వాధీనం చేసుకొన్న వెంటనే ఆ నగరమునకు జపానీ పేరు పెట్టినారు. జపానువారు మన పట్టణములను, పవిత్ర స్థలములను వశపరచుకొనడం తటస్థించినట్లయిన వీటికిగూడ ఇదే విధంగా జరుగుతుంది. మత సాంప్రదాయమువల్లను చారిత్రాత్మకంగాను పేరుగాంచిన పట్టణములన్నియు పాడుచేయుటే గాక జపానీ పేర్లను పెట్టి వాటినే వాడాలని శాసిస్తారు. భారతీయుల అభిప్రాయములను లెక్కచేయరు.

ఈ దేశమునకు చెందిన మన మందరము ఎట్టి పోరాటము లేకుండ అట్టి అనాదరణకు ఒప్పుకుంటామా ? కూడదు. సమిష్టి ప్రతిఘటనచేసి ఈ రాక్షసులను ఎదుర్కొందము.

జపానువారి నెదుర్కొనుటకై దేశీయ యుద్ధ రంగమును తయారుచేయుడు.



PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS